THE ANDHRA PATRIKA - MADRAS

కొరియాఖైదీల శిబిరాలలో పరిస్థితి:బలప్రయోగం తప్పనిసరి అని ఏటస్థ సంఘం నివేదిక

—3 వ పేజీ

# ఆంధ్రపత్రిక

6 పేజీలు వెల 1 అణా.

సూయజ్ వివాదంలో ఈజిప్టు స్వాతంత్ర్యం ప్రధానాంశం: దివాన్ అభిభాషణ

—3 వ పేజీ

Regd. No M. 111 సంపుటం 40. సంచిక 269 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO బుధవారము 30-12-1953



# శ్రీ ఎస్. వి. రామమూర్తిగారి అధ్యక్షత న మద్యనిషేధ విచారణసంఘం

## "శాశ్వతరాజధానికి యోగ్యమైనది గుంటూరు-విజయవాడ ప్రాంతమే"

### పార్లమెంటు డిప్యూటీ స్పీకరు అభిప్రాయం

కర్నూల్లో పక్కా భవనాలుగాని, అసెంబ్లీహాలుగాని కట్టతగదని

అనంతశయనం అయ్యంగారి సలహా

విజయవాడ, డిసెంబరు 28: "ఆంధ్రరాష్ట్రానికి కర్నూలు తాత్కాలిక రాజధాని మాత్రమే. హైదరాబాదు సహా తెలంగాణా జిల్లాలు చేరితే, విశాలాంధ్రకు హైదరాబాదే శాశ్వతరాజధాని అవుతుంది. విశాలాంధ్ర ఏర్పడకపోతే రాజధాని కర్నూలునుంచి మారవలసి వుంటుంది. ఆంధ్ర రాష్ట్ర శాశ్వతరాజధానిని గుంటూరు విజయవాడ ప్రాంతంలో యేర్పాటుచేస్తేనే బాగుంటుందని వ్యక్తిగతంగా నా అభిప్రాయం" అని పార్లమెంటు డిప్యూటీ స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగారు నేడిక్కడ పత్రికా విలేఖరులతో సంభాషిస్తూ చెప్పారు.

విశాలాంధ్ర నిర్మాణము, శాశ్వతరాజధాని సమస్య తేలేవరకూ, కర్నూలులో అసెంబ్లీహాలు వగైరా శాశ్వత కట్టడాలు నిర్మించడం తగదని, అయితే కర్నూలు రాయలసీమలో కెల్లా పెద్ద పట్టణంగాబట్టి, ప్రాంతీయ కార్యాలయాలను పెట్టుకొనుటకు ఉపయోగపడుతవి. గనుక అక్కడ తాత్కాలిక భవనాలు కట్టించ దండుగ కాదని అయ్యంగారు అన్నారు.

ప్రస్తుతం రాజధాని సమస్యను రేకెత్తించవద్దని, వివిధ రాజకీయపక్షాలను, వార్తాపత్రికలను అయ్యంగారు కోరుతున్నారు.

తిరుపతిలో రాయలసీమవిశ్వవిద్యాలయాన్ని యేర్పాటు చేయాలనిగూడా అయ్యంగారు అన్నారు.

మా విజయవాడ విలేఖరి యిలా వ్రాస్తున్నారు:

ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని, విశాలాంధ్ర రాష్ట్రనిర్మాణం విషయం తేలేవరకు కర్నూలులో [illegible]

(2 వ పేజీ చూడుడు)

## "విదేశ స్థావరాల ప్రజల విముక్తికి పోలీస్ చర్యలు"

### అవసరమైతే భారతప్రభుత్వం జరపాలని శ్రీ అనంతశయనంగారి సూచన

విజయవాడ, డిసెంబరు 28: భారత దేశంలోని విదేశీ స్థావరాల ప్రజలు శాంతియుత మార్గాల ద్వారా తమ స్వాతంత్ర్యానికి కృషి చెయ్యాలని అయా విదేశీ ప్రభుత్వాలు గనుక జాతీయ ఉద్యమాలను హింసా యుతంగా అణచ ప్రయత్నించినప్పుడు, భారత [illegible]

[illegible] ములో చేరవలసినదిగా శ్రీ అనంతశయనం విజ్ఞప్తి చేశారు. పార్టీ ప్రయోజనాలకన్న దేశ శ్రేయస్సునె ఎక్కువగా దృష్టిలో వుంచుకుని పంచవర్ష ప్రణాళిక జయప్రదం చేసేందుకు ప్రభుత్వంతో సహకరించవలసినదిగా కమ్యూనిస్టుపార్టీ వారిని కూడ విజ్ఞప్తి [illegible]

### హిందీ ప్రచారసంఘం సందర్శనం

[illegible] పాటు, మన జాతీయభాష హిందీని అంతర్జాతీయ భాష ఇంగ్లీషును నేర్చుకోవాలని వారు విజ్ఞప్తి చేశారు. స్వ. వి.

## "విద్యావిధానం ద్వారా ప్రజ మనస్తత్వం మార్చాలి"

### విశాఖపట్టణం మునిసిపల్ కౌన్సిల్ స్వాగత సభలో డా॥ రాధాకృష్ణ ఉద్బోధ

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

విశాఖపట్నం, డిసెంబరు 28: "దేశసౌభాగ్యం, ఉత్తమ ప్రవర్తన పరస్పర సంబంధం కలవి. కనుక దేశసౌభాగ్యం పెంపొందించాలంటే ఉత్తమ ప్రవర్తన మన ప్రజల కలవడటానికి విద్యావిధానం ద్వారా వారి మనస్తత్వం మార్చాలి. లేకపోతే రాజ్యాంగంలో మనం ఆశించిన ఆదర్శాలు కేవలం ఒక పాత్యగ్రంథంలోని సూత్రాలుగానే వుండిపోతాయి." అని రిపబ్లిక్ ఉపాధ్యక్షులు శ్రీ యస్. రాధాకృష్ణన్ నేటి సాయంత్రం పురమందిరంలో పురపాలక సంఘంవారు సమర్పించిన స్వాగతపత్రానికి సమాధానంగా అన్నారు.

శ్రీ రాధాకృష్ణ గౌరవార్థం కౌన్సిల్ వారు పౌర సన్మాన సభ యేర్పాటు చేశారు. సన్మాన పత్రానికి ఛైర్మను శ్రీ ఎ. వి. భానోజీరావు చదివారు. ఆంధ్ర విశ్వవిద్యాలయానికీ, దేశానికీ శ్రీ రాధాకృష్ణగారు చేసిన అత్యుత్తమ సేవను ప్రశంసించారు. శ్రీ రాధాకృష్ణ [illegible]

[illegible]

ను నే స్వభావం ఇకనైనా వినడాలి. ఈ స్వభావమే దేశాభివృద్ధిని నిరోధిస్తున్నది. దేశసేవకై జీవితాలు అంకితం చేయడానికి ప్రతి స్త్రీ, పురుషుడు ముందుకొచ్చి తమపవిత్ర బాధ్యతను గుర్తెరిగి సంఘాన్ని సుస్థిరం చేయాలి."

### విశాఖ శ్రీకాకుళం జిల్లా బోర్డులు

#### స్పెషల్ ఆఫీసర్లను నియమిస్తూ ప్రభుత్వ ఉత్తరువు

కర్నూలు, డిసెంబరు 28: శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాబోర్డు సభ్యుల ఉద్యోగకాలం డిసెంబరు 29 వ తేదీతో [illegible]

### కర్నూలుకు రంగనాయకి రాక

[illegible]

## విద్యాప్రమాణాలు ఉన్నత స్థాయిలో వుండేట్లు చూడాలి

### విశ్వవిద్యాలయగ్రాంట్ల కమిషన్ ప్రథమ సమావేశంలో ప్రధాని నెహ్రూ ఉద్బోధ

న్యూఢిల్లీ, డిసెంబరు 28: ప్రధాని పండిత నెహ్రూ విశ్వవిద్యాలయ గ్రాంట్ల [illegible]

లయాలను మూసివేయవచ్చు ఈ తిను మని నేను ప్రకటించినప్పుడు విద్యార్థులు ఉపాధ్యాయులు పరస్పరము [illegible]

(2 వ పేజీ చూడుడు)

## సభ్యులుగా న్యా॥ సత్యనారాయణరావు, నీలం రంగనాధంగార్ల నియామకం

### ఫిబ్రవరి ఆఖరులోగా నివేదిక ప్రభుత్వానికి అందాలని నిర్ణయం: మంత్రి పట్టాభిరామారావు ప్రకటన

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

కర్నూలు, డిసెంబరు 29: ప్రస్తుతం రాష్ట్రంలో మద్యనిషేధం ఏవిధంగా పనిచేస్తున్నదనే విషయాన్ని పరిశీలించడానికి ఎస్. వి. రామమూర్తిగారి అధ్యక్షత కింద మరి ఇద్దరి సభ్యులతో ఒకసంఘాన్ని ఆంధ్ర ప్రభుత్వం నియమించినట్లు మద్యనిషేధశాఖమంత్రి ఎస్. బి. పి. పట్టాభిరామారావుగారు నేడిక్కడ ఒక ప్రకటన చేశారు.

ఈ కమిటీ తన సిఫార్సులతోపాటు ఒక నివేదికను ప్రభుత్వానికి పంపిస్తుందని మంత్రి పట్టాభిరామారావుగారన్నారు.

శ్రీ ఎస్. వి. రామమూర్తి (అధ్యక్షుడు), మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి పి. సత్యనారాయణరావు, శ్రీ నీలం రంగనాధన్ (పదవినుంచి విరమించుకున్న విద్యావేత్త) గారలు ఈ సంఘంలో సభ్యులు.

రెవిన్యూబోర్డులో ఎక్సైజ్ మద్యనిషేధ శాఖల కార్యదర్శిగా పని చేస్తు [illegible]

ఆంధ్రప్రభుత్వం నియమించనున్నదనీ, [illegible] వచ్చినవనీ ఆంధ్ర ప్రభుత్వం వాటిని పరిశీలిస్తోందని ఆంధ్రప్రభుత్వ మద్యనిషేధ మంత్రి బలుసు ప్రభాకర పట్టాభిరామారావుగారు ఆంధ్ర శాసనసభ ప్రశ్నోత్తర సమయంలో ఇవాళ కొల్లా వెంకయ్య(కమ్యూనిస్టు)గారి ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

శ్రీ సి. వి. కె. రావుగారి ప్రశ్నకు సమాధానంగా ఈ సమావేశం పూర్తి అయ్యేలోగా మద్యనిషేధం రద్దు అవుతుందీ లేనిదీ చెప్పలేమనీ, ఈ విషయాలను విచారించడానికి విచారణ సంఘాన్ని నియమిస్తున్నామనీ, ఆకమిటీ నియామకానికి అంతా సిద్ధమైందనీ, ఇవాళో రేపో పేర్లుగూడా ప్రకటించగలమనీ మంత్రిగారు అన్నారు.

శ్రీ మాదల నారాయణస్వామి:—అందులో అనధికారసభ్యులు ఉంటారా?

మంత్రి:—తినబోతూ రుచిఎందుకు?

శ్రీ కోలా సుబ్బారెడ్డి:—ఈ విచారణసంఘంవారు ఎంతకాలం వుచ్చుకుంటారు నివేదికకు?

మంత్రి:—వచ్చే బడ్జెటు సమావేశంలోగా నివేదిక ఇస్తారు.

శ్రీ మల్లిపూడి వీరభద్రం:—రద్దుచేసేలోగా నీరా గీతకు అనుమతి ఇస్తారా?

మంత్రి:—ఇంతవరకు ఇచ్చిన వివూర్పు లేదు. కొత్తవి ఇవ్వడము లేదు.

శ్రీ జి. శివశంకరరెడ్డి: ఆ సంఘం వారు జిల్లాల్లో సంచారం చెస్తారా?

మంత్రి:—కమిటీవారు అన్ని విషయాలు ఆలోచించే నివేదిక సమర్పిస్తారు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—శాసనసభ్యులు ఆ సంఘంలో ఎవరైనా ఉంటారా?

మంత్రి:—ఈ విషయం ఆలోచించడానికి పెద్ద సభ్యులను అసంఘంలో వేస్తున్నాము.

శ్రీ దర్శిలక్ష్మయ్య:—మద్యనిషేధం విఫలమైందని తెలిసికూడా ఇట్టి సంఘంయొక్క నియామకావసరాన్ని తెలుపుతారా?

మంత్రి: మద్యనిషేధంవల్ల లాభమే వచ్చిందో నష్టమేవచ్చిందో విచారణసంఘంవారు నిర్ణయించగలరు.

శ్రీ: కమిటీ స్వరూపం ఎల్లా ఉంటుంది?

స. రాజకీయాలను అతీతమైన సభ్యులుగల ఒక కమిటీని వేస్తున్నాము.

[illegible] మద్యనిషేధం రద్దుచేస్తే మరి [illegible] నిలకడగ ఉంటుందని వాఅభిప్రాయం.

మంత్రి: నిజంగా మేమే ముందుదాన్ని తీసేస్తే ప్రతిపక్షంవారే వద్దు అ నేటున్నారు.

### అసెంబ్లీలో ప్రశ్నలు

కర్నూలు, డిసెంబరు 29: నేడో, రేపో మద్యనిషేధ విచారణసంఘాన్ని [illegible]

## స్టేట్స్ కౌన్సిలుకు గురుమూర్తిగారి ఎన్నిక

### సికింద్రాబాదు మేయరు

హైదరాబాదు, డిసెంబరు 28: బియస్. వెంకటరావుగారి మరణంలో ఖాళీపడిన స్టేట్సు కౌన్సిలు స్థానానికి సికిందరాబాదు మేయరు బి. వి. గురుమూర్తిగారు ఏకగ్రీవంగా ఎన్నుకోబడనున్నారు. ఈఎన్నికకు గురుమూర్తిగారొక్కరే నామినేషన్ దాఖలు చేశారు. మరెవరూ చేయలేదు. సంస్థాన శాసనసభ కార్యదర్శి యం. హనుమంతరావుగారు ఆయన నామినేషనును పరిశీలనచేసి, అది సక్రమంగానే ఉన్నట్లు పేర్కొన్నారు. నామినేషన ఉపసంహరణకు డిసెంబరు 31 కడపటిరోజు. అటు తర్వాత ఆయన ఎన్నికైనట్లు లాంఛనంగా ప్రకటింపబడుతుంది. (స్వ. వి)

## ఇండోచైనాలో వియట్మిన్ల కొత్త వ్యూహం

### సెనో విమానాశ్రయంపైకి దండయాత్ర

పారిస్, డిసెంబర్ 28: 16 వ అక్షాంశరేఖ వెంబడి ఇండోచైనాను రెండుగా చీల్చివేసిన వియట్మిన్ బలాలు ఈ వేళ దక్షిణంగా తిరిగి కొత్తదండయాత్రను ప్రారంభించివి [illegible]

కొన్ని ఇక్కట్లు వాటిలు కలిగించినవి, లావోస్ ప్రధాని సహాయానికై చేసిన విజ్ఞప్తిని సయాం జాగ్రత్తగా పరిశీలిస్తున్నది.

### కాంబోడియా ఆందోళన

వియట్మినులు దాడి చేస్తే ఫ్రెంచి సేనలు దెబ్బకొంచుకునే లోపల కొంత [illegible]

[illegible]

(2 వ పేజీ చూడుడు)

# చైనాసాంస్కృతిక రాయబారవర్గం

## మద్రాసుకు రాక

మదరాసు, డిసెంబరు 28: నవచైనా సాంస్కృతిక రాయబారవర్గం డాక్టర్ టింగ్ సిలింగ్ గారి నాయకత్వాన యీనాళ ఉదయం విజయవాడనుండి మదరాసు వచ్చింది. స్టేషనులో వారికి మదరాసు పౌరుల తరఫున ఘనమైన స్వాగతం యివ్వబడింది. ఈ రాయబారవర్గం గౌరవార్థం మధ్యాహ్నం మెరినా క్యాంటీన్‌లో విందు జరిగినది. రాయబారవర్గ సభ్యులకు యితర అతిథులకు మదరాసు శాంతిసంఘం తరఫున శ్రీ పరమేశ్వరన్ గారు స్వాగతమొసగారు.

అతిథులెల్లరూ విందారగించిన మీదట శ్రీ యస్. వి. ఆదిత్యన్ గారు భారతదేశ పౌరుల తరఫున నవచైనా సాంస్కృతిక రాయబారవర్గానికి శుభాకాంక్షలను అందజేస్తూ చైనాలోని 50 కోట్ల జనాభా భారతదేశంలో 40 కోట్ల జనాభా ఏకంగా కలిసి ఉంటే ప్రపంచంలో సుస్థిరశాంతికి అండగా ఉండవచ్చునని అన్నారు. చైనాలో సర్వజనులతో కూడిన ప్రజారాజ్యం ఉన్నదని నవచైనా మంచి అభివృద్ధిలోకి వచ్చియున్నదనీ చైనా భారతదేశాల మధ్య పరస్పర సుహృద్భావం అన్యోన్యత హిమాలయాలు, సముద్రములో నీరున్నంతకాలం చిరస్థాయిగానుంటున్నవో అంతవరకు ఉండగలదని ఆశిస్తున్నాననియు అన్నారు.

చైనా రాయబారవర్గ నాయకుడు డా॥ టింగ్ సీలిన్ గారు తమ దేశ ప్రజల తరఫున భారతదేశ ప్రజలకు సుహృద్భావ సందేశాన్ని అందజేస్తూ ఉభయదేశాల స్నేహ సౌభ్రాత్ర్యాలు పెంపొందడం ప్రపంచానికే మేలని అన్నారు.

సర్దార్ గురుబక్ష్ సింగ్ గారు చైనా అతిథులకు శుభాకాంక్షలు తెలియజేశారు.

ఈ రాయబారవర్గంలో యిద్దరు స్త్రీలు కలరు.

## చైనా రాయబార వర్గమునకు రాజమండ్రిలో సన్మానము

రాజమండ్రి, డిసెంబరు 26: నవచైనా సాంస్కృతిక ప్రతినిధి వర్గము వారి ఈయంత్రము కలకత్తా మెయిలులో మద్రాసు పోతున్న సందర్భమున-రాజమహేంద్రవర భారతచైనా మిత్రమండలివారు-వారికి ఘనస్వాగత మిచ్చారు. కార్యకర్తలు డాక్టర్ గరికపాటి రాజారావు, శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తిగారలీ యేర్పాట్లు చేశారు. శ్రీ దామెర్ల వెంకటరావు (మాజీ కాంగ్రెస్ యం.యల్.సి.) శ్రీ చిట్టూరి ప్రభాకర చౌదరి-శ్రీ అల్లూరి వెంకటరామరాజు ఎం.ఎల్.ఎలు శ్రీమతి కోరిపల్లి మహాలక్ష్మమ్మ-శ్రీమతి మోపాడ పిరియమ్మ (మున్సిపల్ కౌన్సిలర్లు) శ్రీ పోకల సోమేశ్వర ప్రకాశ రావు ప్రభృతులు పాల్గొన్నారు

వివిధ కార్మిక సంఘములవారు ప్రతినిధి వర్గంవారికి పూలమాలలు వేసి సత్కరించారు. యీ పట్టణంలో తయారయే అల్యూమినియం యిత్తడి పాత్రలు వారికి బహూకరింపబడినవి. శ్రీ చల్లా రాధాకృష్ణమూర్తి ఆంగ్లమున సన్మానపత్రము చదివి సమర్పించారు. చైనా ప్రతినిధి వర్గ నాయకుడు శ్రీ టింగ్ సీలింగ్ సమాధానమిస్తూ స్వాగతమునకు కృతజ్ఞత తెల్పారు. వేయి సం॥ల చైనా-భారతసన్నిహిత సంబంధాలు యింకా పటుతరం చేయాలన్నారు. ఉభయ దేశాలూ శాంతి వాంఛించేవనీ-ప్రపంచశాంతియే మన ఆశయమనీ చెప్పారు. (స్వ. వి.)

# ఐనవరం పాల సప్లయి సంఘం

## శ్రీ ప్రకాశ్ సందర్శనం

మదరాసు, డిసెంబరు 28: మదరాసు గవర్నరు శ్రీ ప్రకాశాగారు, కోడలు శ్రీమతి కామినీదేవిగారితోను ఎ.డి.సి. గోవిందస్వామిగారితో ను, కలిసి యీనాళ ఉదయం ఐనావరంలోగల మదరాసు సహకార పాల సప్లయి సంఘపు ఫాక్టరీకి అరుదెంచి ఫాక్టరీ వివిధ భాగాలను శ్రద్ధతో దర్శించారు. గవర్నరుగారు పాలఫాక్టరీకి రాగానే సహకార సంఘాధ్యక్షుడు శ్రీ కే. ఎస్. శివన్ గారు కార్యదర్శి శ్రీ యం. ఆరుళానందంగార్లు వారికి ఆహ్వానమొసగారు.

గవర్నరుగారికి పాలసప్లయి యూనియన్ అధ్యక్షుడు డైరెక్టరులను పరిచయం చేసినమీదట పాలను వడపోసే యంత్రమును దానిని ఒక ఉష్ణానికి వేడిచేసి చల్లార్చే యంత్రమును పాల సీసాలను నిలవచేసి యుంచే మంచు కొట్టును, జున్ను తయారుచేసే యంత్రమును మొదలైనవాటిని గవర్నరుగారు ప్రతి విషయము అడిగి తెలుసుకుంటూ చూచారు. గవర్నరుగారు స్వయంగా జున్ను తయారుచేసే యంత్రాన్ని కూడా కొద్దిసేపు తమ చేతులతో త్రిప్పిచూచారు.

ఫాక్టరీ దర్శనము పూర్తిఅయిన మీదట సంఘాధికారులు గవర్నరుగారికి యితర అతిథులకు అల్పాహారముతో సత్కరించారు.

అల్పాహారవిందు అనంతరం గవర్నరు శ్రీ ప్రకాశాగారు పాలసప్లయి యూనియన్ 25 యేండ్లుగా నగరవాసులకు పరిశుభ్రమైన అప్పటమైన పాలను సప్లయిచేయుటకు సాగిస్తున్న కృషిని విశేషంగా ప్రశంసించారు. సంఘంవారు నగరవాసులకు రూ 21 లక్షల విలువగల పాలను సప్లయిచేసి రూ. 31000 మాత్రమే లాభం పొందియున్నారని, అప్పటమైన పాలసప్లయి చేస్తున్న యీ సంఘము యితర చిల్లర పాలవ్యాపారస్తులకు ఆదర్శముగా నుండి యితరులయొక్క కల్తీవ్యాపారపు అలవాటును కూడా సరిదిద్దుటకు మార్గదర్శకముగా నుండగలుగునని ఆశించారు.

శ్రీ కే. యస్. శివన్ గారు గవర్నరుగారికి వందనము లర్పిస్తూ సంఘంవారు గవర్నరుగారి హితవును సరిగా అనుసరించుటకు తప్పక కృషి చేయగలదనియు మదరాసునగర ప్రజలకు మొత్తంమీద రోజు కావలసిన పాలలో అయిదవవంతును యీ సంఘము సప్లయి చేస్తున్నదని చెప్పారు.

---

మద్రాసు, డిసెంబరు 28: సెంట్రలు స్టేషనులోని రైల్వే పోలీసుస్టేషనుకు చెందిన హెడ్ కానిస్టేబుల్ శివలింగంను బేసిన్‌బ్రిడ్జిదగ్గర నిన్న ఎవరో దుండగుడు కత్తితో పొడిచి పారిపోయాడు. అతన్ని పట్టుకోవడానికి ఆ సమయంలో ఎదురుగా యీ సంఘటన చూసి పరుగెత్తుకు వచ్చిన యిద్దరు పోలీసులు చేసిన ప్రయత్నాలు విఫలమైనవి.



# మానవ దృక్పథంలో మార్పు ఆవశ్యకత

## అంతర్జాతీయ న్యాయమహాసభలో రాష్ట్రపతి ప్రసంగం

న్యూఢిల్లీ, డిసెంబరు 28: మానవకోటి లోనుకాబోతున్న మహాప్రమాదమునుంచి దానిని రక్షించాలంటే మానవదృక్పథంలో మార్పు రావటం అవసరమని రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ అన్నారు.

ఆసియాఖండంలో తొలిసారిగా జరుగుతున్న అంతర్జాతీయ న్యాయమహాసభను ప్రారంభిస్తూ రాష్ట్రపతి ఈమాట అన్నారు. ప్రపంచం అంతటినుంచీ వచ్చిన ప్రముఖన్యాయవేత్తలు, న్యాయవాదులుఅలంకరించిన ఆసభలో ఆయన ఇంకా ఇట్లా అన్నారు. ఈనాడు మహాప్రబలంగా వున్న రాజ్యాలుకూడా తమ ప్రత్యర్థులంటే నిరంతంభీతితో వుంటున్నాయి. ఆ భీతిని పోగొట్టుకోవడానికి ఎవరిమట్టుకు వారు తమ ఎదిరికంటె సకల సాధన సామగ్రి విషయంలోనూ తమదే పైచేయిగా వుండేటట్లు చేసుకోవటానికి పనిచేస్తున్నాయి. ఇదంతా ఆత్మసంరక్షణకోసం కొంత, పగతురను పరిమార్చటంకోసమే ముఖ్యంగా జరుగుతోంది. ఈభీతీ, సాధనసామగ్రి చేకూర్చుకోవాలనే అంతులేని ఈ దాహమూ, ఇవే మరొకవిధంగా, అనేక రీతుల మానవస్వాతంత్ర్యాలను అదుపులో వుంచె ప్రయత్నాలకు దారితీస్తున్నవి.

దీనికిముందు భారత ప్రధానన్యాయమూర్తి పతంజలిశాస్త్రి ప్రతినిధులకు స్వాగతంచెబుతూ ఇదేవిధమైన భావాలు వెలిబుచ్చారు. అన్నిటినీ అంతంచేసే ఈఅణుశాంబుయుగంలో సమాజాతులు పూర్తి సర్వతంత్ర స్వాతంత్ర్యభావాలను ఇకతావులేదన్నది గ్రహించి అఖిల ప్రపంచానికి సమష్టి ప్రయోజనాలూ, బాధ్యతలూ అన్న ప్రాతిపదికపై ఒక నూతన అంతర్జాతీయ వ్యవస్థను సృష్టించేందుకు ఒప్పుకోవాలి. అట్టి నూతన ప్రపంచవ్యవస్థ ఏర్పడేశుభదినం ఎంతో దూరంలేదని మేము భావిస్తున్నాము. అంతర్జాతీయ న్యాయసూత్రాల వెనుకగల భావాలను ప్రస్తుత ప్రపంచ పరిస్థితులకు అనుగుణంగా మార్చటానికి కాలం ఇప్పటికి పరిపక్వమైనదనికూడా మేము తలుస్తున్నాము అని వారన్నారు.

# చివరికి అంతా దేవుడికి లొంగాల్సిందే

## అరుణా అసఫ్అలీ వ్యాఖ్య

మధుర, డిసెంబరు 28: భారత కమ్యూనిస్టుపార్టీ తృతీయ మహాసభకు విచ్చేసిన ప్రముఖ వామపక్ష నాయకురాలు అరుణా అసఫ్అలీ నేడు మధుర మీనాక్షీదేవి ఊరేగింపును చూస్తూ, చివరకు మనమంతా దేవుడికి లొంగాల్సిందేకదా అని అన్నది.

సరిగా వేళే సందర్భంలో కమ్యూనిస్టు పార్టీ కట్టిన ఒక అలంకారపు ఆర్చీ దేవి రథానికి అడ్డంరాగా తీసివేశారు. ఈ సంఘటనను ఆమె రైల్వే వెయిటింగు రూములోనుంచి చూస్తూ ఈమాట అన్నది. అనేకమంది కమ్యూనిస్టు నేతలుకూడా ఈ ఊరేగింపును దర్శించారు.

# సైనిక సలహాదారు రసెల్ విరమణ

న్యూఢిల్లీ, డిసెంబరు 27: భారత సైనిక సలహాదారయిన లెఫ్టినెంటు జనరల్ సరడ్వ్యాలీ రసెలు జనవరి 20 నుంచి ఉద్యోగమునుంచి విరమించుకుంటున్నారు.

ఈతడు భారతసేవలో 40 సంవత్సరాలనుంచి పని చేస్తున్నాడు. 1948 లో ఈతణ్ణి సైనిక సలహాదారుగా నియమించారు. మొదటి ప్రపంచ మహాసంగ్రామంలో ఈయన ఫ్రాన్సు, పాలస్తీనాలలో ప్రశంసనీయసేవచేసి ముఖ్య పతకాలు పొందాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఉత్తరాఫ్రికా, ఇటలీలలో పనిచేశాడు.

ఈతని తరువాత సైనిక సలహాదారు పదవిని రద్దుచేస్తారు.

# హిందూపురంలో మాంస విక్రేతల సమ్మె

హిందూపురం, డిసెం 22: అంగళ్ళ కేంద్రం విషయమై, పురపాలక సంఘంతో పేచీ వచ్చినందున 20 వ తేదీనుండి, ఇక్కడ మాంసపు వ్యాపారులు, అంగళ్ళు మూసివేసి సమ్మె చేస్తునారు.

## కీ॥ శే॥ డా॥ రామానుజయ్యగారు

మద్రాసు, డిసెంబరు 27: డా॥ సి. రామానుజయ్యగారు నిన్న గోపాలపురం లాయిడ్స్ రోడ్డులోని తమ నివాసంలో 72 వ ఏట మరణించారని తెలుపుటకు విచారిస్తున్నాము. వారు రాయపేట గవర్నమెంటు ఆసుపత్రిలో సూపరింటెండెంటుగా పనిచేశారు. రిటైర్డు సివిల్ సర్జను. 1906 లో వారు మద్రాసు మెడికల్ సర్వీసులో ప్రవేశించారు. గంజాం, చిత్తూరు, సంబూరు, ఉభయగోదావరి మండలాల్లో జిల్లా వైద్యశాఖాధికారిగాను, మద్రాసు మెడికల్ కాలేజీలో మెడికల్ జూరిస్‌ప్రూడెన్సు ప్రొఫెసరుగాను పనిచేశారు. 1936 లో రిటైరైనారు. వారికి పలువురు బంధువులు మిత్రులు ఉన్నారు.

# 50 వేల టన్నుల హైద్రాబాద్ జొన్నలు

## 1954కిమద్రాసురాష్ట్రానికిసప్లయి

హైదరాబాదు, డిసెంబరు 28: వచ్చే సంవత్సరం మద్రాసుకు హైదరాబాదు నుంచి కనీసపక్షం 25000 టన్నులూ, గరిష్ఠపక్షం 50000 టన్నుల జొన్నలు లభిస్తాయి. ఈసంగతి ఇవాళ శాసనసభలో సప్లయిమంత్రికి ప్రాతినిధ్యం వహిస్తూ ఎక్సైజ్ మంత్రి కె. వి. రంగారెడ్డిగారు వెల్లడించారు.

1954 సంవత్సరానికి ఖారిఫ్ పంట నుంచి 25000 టన్నుల జొన్నలను మిగులు ధాన్యంగా ప్రభుత్వం ప్రకటించిందనీ, రబీపంట బాగా ఉంటేటట్లయితే ఇంకొక 25000 టన్నులను కూడ కేంద్రానికి వాగ్దానం చేసిందనీ రెడ్డిగారు ఒకానొక ప్రశ్నకు సమాధానంగా తెలియజేశారు. ఈ మొత్తం సరుకు యావత్తూ కేంద్రం మద్రాసు రాష్ట్రానికి కేటాయించినట్టు కూడ ఆయన చెప్పారు.

# హైద్రాబాద్ మున్సిపల్ చట్ట సవరణ బిల్లు

## గెజెట్ ప్రకటన

హైదరాబాదు, డిసెంబరు 28: హైదరాబాదు పురపాలక, పట్టణ సంఘాల చట్టం (1951) సవరణబిల్లు ఒకటి నేడు గజెట్టులో ప్రచురింపబడింది.

ఈ బిల్లు మేరకు ఆదాయమూ, జనాభా, అనుమతించేటట్టువంటి పెద్ద పెద్ద పురపాలక సంఘాలకు మాత్రమే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు నియమింపబడతారు. తక్కిన పురపాలక సంఘాల విషయంలో వాటి ఆర్థికస్థితి బాగుపడి, పూర్తి జీతంమీద పూర్తి కాలపు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లను నియమించ గలిగిన తాహతు వచ్చేటంతవరకూ అధ్యక్షులకే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లుగా పనిచేయడానికి అధికారం మివ్వడమవుతుంది.

# శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రి శతాబ్ది ఉత్సవం

## నెల్లూరులో ముఖ్యమంత్రిచే చిత్రపటావిష్కరణ

నెల్లూరు, డిసెంబరు 27: పురమందిర ఆవరణలో శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారి అధ్యక్షతన శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారి శతాబ్దిమహోత్సవ ద్వితీయదిన కార్యక్రమం నిన్న జరుపబడినది.

ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంపంతులుగారు చిత్రపటావిష్కరణ జరిపారు. శ్రీమతి పి. సుబ్బలక్ష్మిగారు ప్రారంభంలో దైవప్రార్థన చేశారు. శ్రీ ప్రకాశంగారు చిత్రపటావిష్కరణజరుపుతూ మహాపండితుడు, కవిశ్రేష్ఠులు, బహుళగ్రంథకర్తఅయిన శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారి చిత్రపటావిష్కరణ తమవంటి సామాన్యుడు జరుపడం తగదేమోనన్న సందేహం వెలిబుచ్చారు. కవితాపోషణకు పేరెన్నికగన్న నెల్లూరునగరవాసులను అభినందించారు. పిదప చిత్రపటావిష్కరణం జరిపారు. శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు యీ రూపపటమును పురమందిరమున వుంచుటకు కమిటీతరఫున ఆమోదం తెలిపారు.

## అధ్యక్షోపన్యాసం

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు తమ అధ్యక్షోపన్యాసంలో యిలా అన్నారు.

"శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి వారు ఎచటనుండినను తమ నెల్లూరు మండలమును మరువలేదు. వారిని బహువిధములుగ పోషించి కేయూరతనిచ్చినది వెంకటగిరి వెలుగోటి ఆస్థానాధీశులు. వారి నాటకములు యీ మండలములో వివిధనాటకశాలలో ప్రదర్శింపబడినవి. పలువురు పండితులు, కవులు, వారి ననుసరించినారు. మోపూరు రేబాలవారు, ఇందుకూరు యారబాలువారు, అల్లూరు బొమ్మకొండవారు వారి భాషాసేవకెంతో సహకరించారు. గోఖలేహాలులో శాస్త్రిగారికి మద్రాసు పౌరులు ఆకాలములో రు 1116/-లు సమర్పింప నిర్ణయించి రు 1000/-లే తుదకు సేకరించగలిగిన సమయంలో నెల్లూరువాసులు తమవంతు 116 రూ. లు. పంపగలిగినారు. శ్రీ శాస్త్రిగారి వ్యాఖ్యలు, సంస్కృతము నుండి గావించిన అనువాదములు ప్రతిష్ఠ చెందినవి. సంస్కృతనాటకములలోని రసమును ఆంధ్రులకు అందించగలిగినారు.

శాస్త్రిగారు నిర్భయముగా సమకాలిక పండితుల విమర్శల నెదుర్కొన్నారు. వారి రచనలు క్రమేణ యితరరచయితలకు మార్గదర్శకములయ్యెను."

పిదప వ్యాసరచనల్లో ఉత్తీర్ణులైన వారికి ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారు బహుమతులు పంచిపెట్టారు. శ్రీ యన్. శేషగోపన్ (జరిప్పా) గారికి బంగారుపతకం బహూకరించబడినది. రాత్రి ప్రతాపరుద్రీయము నాటకము ప్రదర్శించబడెను.

శాస్త్రిగారిపై సురం వెంకటసుబ్రహ్మణ్యం, శ్రీమతి చల్లా సీతాంబగారు రచించిన పద్యాలు చదివారు. సుందరదాసు గారు ఆంగ్లంలో పద్యాలు చదివారు. సురం సుబ్బరామయ్యగారి వందనములతో సభ ముగిసినది. (స్వ. వి.)

# క్రీడారంగం

## నేషనల్ టెన్నిస్‌లో నరేంద్రనాథ్ ఓటమి

కలకత్తా, డిసెంబరు 28: ఇండియా నంబర్ 2 అయిన నరేంద్రనాథ్ నేడిక్కడ నేషనల్ లాన్ టెన్నిస్ చాంపియన్‌షిప్ క్వార్టర్ ఫైనల్సులో ఓడిపోయినాడు. ఆస్ట్రేలియా ప్రతినిధి అర్విన్ స్టాల్ నరేంద్రనాథ్‌ను ఒక్క సెట్ కూడ ఇవ్వకుండ ఓడించాడు (9-7,6-4, 6-3)

మెన్స్ డబుల్స్‌లో సుమంత్ మిశ్రా, ఆర్ కృష్ణన్‌లు ఎం. వి. జి అప్పారావు, ఆర్. కె. రాంలను ఓడించారు.

## సైక్సాస్‌పై హోడ్ గెలుపు

మెల్బోర్న్, డిసెంబర 28: ఈ వేళ ఇక్కడ ఆస్ట్రేలియా,అమెరికాలమధ్య ప్రారంభమయిన అంతర్జాతీయ డేవిస్ కప్ టెన్నిస్ ఛాలెంజ్ రౌండ్‌లో ఆస్ట్రేలియాకు రెచాంపియన్ హోడ్ వింబుల్డన్ చాంపియన్ అయిన సెక్సాస్‌ను ఓడించాడు, హోడ్ సెక్సాస్‌కు ఒక్క సెట్టునుకూడా ఇవ్వలేదు (6-4, 6-2, 6-3)

అయితే హోడ్ జతగాడయిన రోజ్వాల్‌ను మాత్రం అమెరికన్ ప్రతినిధి ట్రాబర్ ఓడించాడు (6-3,6-4, 6-4)దీనితో ఈవేళకు ఉభయ దేశాలూ సమానం అయినవి.

## శ్రీరాములు మెమోరియల్ గోల్డ్‌కప్ ఫుట్‌బాల్

రాజమండ్రి, డిసెంబరు 26: శ్రీ పొట్టి శ్రీరాములు మెమోరియల్ క్లబ్ అధ్వర్యాన గోల్డుకప్ ఫుట్ బాల్ టోర్నమెంటు డి. 25-12-53 తేదీ సాయంత్రం 4 గంటలకు యిచటపాత ఆర్ట్సు కాలేజ్ గ్రవుండ్సులో, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సభ్యులు, ఆంధ్రప్రదేశ్ యువజన కాంగ్రెసు అధ్యక్షులు తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారిచే ప్రారంభోత్సవం జరుపబడింది.

అమరజీవి పొట్టి శ్రీరాములు గార్ని స్మరిస్తూ ప్రార్థనగీతం పాడటంతో కార్యక్రమం ప్రారంభమైంది.

టోర్నమెంటు కమిటీ కార్యదర్శి శ్రీ కలిమిరెడ్డి సుబ్రహ్మణ్యం గారు ప్రారంభకులకు, ప్రేక్షకులకు స్వాగతం చెబుతూ-రాజమండ్రి పట్టణంలో స్టేడియం నిర్మింప చేయటానికి వుద్దేశించబడిన టోర్నమెంటు ఆశయాన్ని వివరిస్తూ అన్ని విధాల సహకరించవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ టోర్నమెంటుకు ప్రారంభోత్సవం చేయవలసిందిగా తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగార్ని కోరారు.

తొలిపోటీలో రైల్వే స్పోర్టింగ్ క్లబ్, ఏలూరు బ్లాక్‌పర్లును అయిదు గోలులు చేసి విజయం పొందింది

## ఈమనిలో ఆటల పోటీలు

ఈమని, డిసెంబరు 25: క్రైమెడ్ శర్మ మెమోరియల్ టోర్నమెంట్సు కమిటీ అధ్వర్యమున తెనాలితాలూకా ఈమని గ్రామములో జనవరి 22 వ తేదీ మొదలు చెడుగుడు, వాలీబాల్, బాడ్మింటన్ ఆటలలో గుంటూరుజిల్లా పోటీలు జరుపబడుననిన్నీ 10 వ తేదీ లోపల సదరు పోటీలకు దరఖాస్తులు పంప గోరినామనిన్నీ కమిటి కార్యదర్శి శ్రీ ఎన్. పి. శంభుసాల్వలింగం గారు తెలియజేయుచున్నారు. స్వ.వి.

# రేడియో

## గురువారం, డిశంబర్ 31

విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం, 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె, 7-30 మద్రాసువలె, 8 ఆంగ్లమున వా॥.

మ॥ 1 మద్రాసు (బి) వలె, 1-30 మద్రాసు (ఎ) వలె, 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 4 గానసుధ (రి).

సా॥ 5-30 సంగీతోత్సవం, (మద్రాసునుండిరిలే), 6 సంగీతశిక్షణ, 6-15 స్థానిక ప్రకటనలు, 6-20 వాద్య సంగీతం: గ్రామస్థుల కార్యక్రమం, 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-30 గానసుధ (రి), 7-45 పోటీఆటల సమీక్ష, 9-15 గీతావళి: ఎ. శ్రీనివాసన్ (రి), 9-30 సంగీతోత్సవం (మద్రాసు నుంచి రిలే).

మద్రాసు (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం, 7 వాద్య సమ్మేళనం, 7-15 తమిళమున వా॥ 7-30 పాలియూర్ కనకభారతి అయ్యర్ (గాత్రం), 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 సరస్వతీ రామమూర్తి (గాత్రం) 1 మహిళావాణివలె 1-30 గీతమంజరి (రి) 1-40 హిందీలో వార్తలు 1-50 (గానమంజరి) (రి) 2 తమిళమునవార్తలు 2.10 మద్రాసు (బి) వలె.

సా॥ 4 మద్రాసు (బి) వలె 4-30 పాశ్చాత్యసంగీతం (రి) 5-30 సంగీతోత్సవం 6 ఆంగ్లమున వార్తలు 6-15 పి. యస్. కోకిలం, గాత్రం 7 రాత్రి సెట్ నిలయవిద్వాంసుడు 7-15 తమిళమున వార్తలు 7-30 కనవర్షధ్వని ప్రసంగం (తమిళప్రసంగం) 7-45 సంగీతోత్సవం 9 ఆంగ్లమున వార్తలు 9-15 వీణ నిలయవిద్వాంసుడు 9-30 జేగం అక్బర్ (రి).

మద్రాసు (బి)

ఉ॥ 6-55 మద్రాసువలె, 7 తెలుగున వార్తలు, 7-15 యస్. వి. వసంత కోకిలం (రి) 7-30 మద్రాసువలె (రి).

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మద్రాసువలె 1 గీతమాలిక(రి) 1-30 ఆంగ్లమునవార్తలు 1-50 తెలుగునవార్తలు, 2 ఢిల్లీబారి నిలయ విద్వాంసుడు లక్ష్మిలో సుబ్రహ్మణ్యం, వీణ.

సా॥ 4 ఎమ్. యాస్ కృష్ణస్వామి అయ్యంగార్. 4 మద్రాసు (ఎ) వలె 4-30 మద్రాసు (ఎ) వలె 5-30 మద్రాసు (ఎ) వలె 6-15 వేణువు (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7 తెలుగునవార్తలు 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 యశస్సు అప్తదారులు (ప్రసంగం) దాసు వామనరావు.

హైదరాబాదు

ఉ॥ 6-55 సుప్రభాత్ (రి) 7 తెలుగున వా॥ 7-15 ఎ. కె. కమలమ్మాళ్ (గాత్రం) 7-45 సోవనా చమేలీ పాధ్యాయ భజన 8 ఆంగ్లమున వా॥ 8-30 ప్రభావతీ ముష్తాక్ ఖయాల్ 6 సారస్వత కార్యక్రమం (హిందీ) 6-30 భజన్ (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ కార్యక్రమము, దేవీభాగవతము (నోరి నరసింహశాస్త్రి) 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ 7-45 కన్నడమున వా॥ 8 పుస్తక సమీక్ష 8-15 అహమ్మద్ రఫీక్ ఘజల్ 8-30 ప్రభావతీ ముష్తాక్ ఖయాల్ 9 ఆంగ్లమున వా॥ 9-15 ఉర్దూలో వా॥ 9-30 కదసారి (సంగీతరూపకం) 10 రుక్మిణీ నరసింహన్.

# మదరాసు ధరలు

మదరాసు, డిశంబరు 28:

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటకు

| | |
|---|---|
| సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా | రు. 56-12-0 |
| సెట్లుబంగారు తులం | రు. 83.8.0 |
| మూస బంగారు | రు. 81-8-0 |
| సీమవెండి తులం100 కి రెడి | 155-0-0 |
| చిల్లర ధర | రు. 1-9-0 |

వేరుశనగ:

| | |
|---|---|
| (581 సా॥ 1-కి ఎక్సు కోస్టా గిడ్డంగులు మెషిన్- సేల్సుటాక్సుతో సహా) | రు. 162-0-0-168 |
| వేరుశనగనూనె ఎక్సు పెల్లర్ బిలో 3% (500సా.) రెడి చిల్లరధర | రు. 320-325 |
| వెంకోయనూనె (87½ సౌనులు గల) | |
| అంబుమార్కు | రు. 33-8-9 |
| ఎం.ఎస్. బ్రాండ్ డబ్బా | 33-8-9 |
| రాజా బ్రాండ్ | రు. 33-0-9 |

ఆముదం

| | |
|---|---|
| 500 సౌనులు గల కారుడు ఒకటికి | |
| తిరుపత్తూరు | రు. 270-0-0 |
| వేలూరు జూపిటర్ బ్రాండ్ 37½ సా. | 20-0-9 |

పంచదార

| | |
|---|---|
| బ్రిటిషు (తెల్లది) (2 అందరు) | 85-0-9 |

# హైద్రాబాద్ మార్కెట్ ధరలు

(సప్లయిదారు సుబ్బా బుచ్చయ్యగారి వంకశేఠం.)

హైద్రాబాద్, డిశంబరు29:

| | |
|---|---|
| బంగారం తు. 1-కి | 81-7-0 |
| వెండి 100 తు. | 149-2-0 |
| పసుపుపల్లా | 105-130-0-0 |
| పెసలు | 85-0-0-87-4-0 |
| కందులు | 33-0-0-41-0-0 |
| మినుములు | 40-0-0-46-0-0 |
| లంకలు | 40-0-0-4?-12-0 |
| ఉలవలు | 25-26-0-0 |
| కందిపప్పు పెద్దది | 50-0-0-52 |
| కందిపప్పు చిన్నది | 43-45 |
| పెసరపప్పు | 50-52 |
| వేరుశెనగపప్పు | 76-8-0 |
| మినప పప్పు | 60-62-0-0 |
| అముదాలు | 54-54-12-0 |
| చింతపండు | 100-183 |
| మిర్చి | 180-0-0-305-0-0 |
| కుసుములు | 48-53-0-0 |
| ధనియాలు | 6-12-0-7-8-0 |
| జవాలు | 9-4-0-9-8-0 |
| ఉగడ్డలు | 26-0-0-32-0-0 |
| నువ్వులు | 78-0-0-110 |

# బొంబాయి మార్కెట్

బొంబాయి, డిశంబరు 29: ఇవాళ బొంబాయి మార్కెట్ ధరలు ఈ విధంగా వున్నవి.

| | |
|---|---|
| వెండి (100 తు.) | 152-11-0 |
| బంగారం (1 తు.) | 82-9-0 |
| సావరిన్ | 56.4-0 |
| కలకత్తా ధరలు: — | 152-5-0 |
| 82 9-0 సావరిన్ | 56 12-0. |

# హైదరాబాదు జిల్లా బోర్డుల బిల్లు

## సెలెక్టు కమిటీ నివేదిక సమర్పణకు ఇంకొక 3 నెలల గడువు

హైదరాబాదు, డిసెంబరు 28: హైదరాబాదు జిల్లాబోర్డుల బిల్లుపై సెలెక్టు కమిటీ నివేదిక సమర్పణకు పెట్టియుంచిన గడువును హైదరాబాదు శాసనసభవారు ఇవాళ మరొక మూడుమాసాలు పెంచారు. (స్వ. వి)

# న్యాయకార్య నిర్వాహకశాఖల విభజన

## ఉత్తరప్రదేశ్ న్యాయవాదుల మహాసభ తీర్మానం

బనారస్, డిసెంబర్ 27: ఉత్తరప్రదేశ్‌లో న్యాయ కార్యనిర్వాహకశాఖల విభజనను వెంటనే పటిష్ఠంగా అమలు జరపాలని ఈ రాష్ట్ర న్యాయవాదుల మహాసభవారు తీర్మానించారు.

# తాడేపల్లిగూడెంలో ధాన్యం ధరలు

తాడేపల్లిగూడెం, డిసెంబరు 27: ఈ వేళ యిక్కడ ధాన్యం, బియ్యం ధరలు ఈ విధంగా ఉన్నవి.

| | |
|---|---|
| ధాన్యం: (166 సౌన్లు బస్తా) | |
| బసంగి | 17-8-0.18-4-0 |
| అక్కుళ్లు(కొత్తవి) | 18-4-0.18-8-0 |
| ,, (పాతవి) | 22-0-0 |
| కృష్ణ కాటుకలు (పాతవి) | 24-0-0 |
| ,, (కొత్తవి) | 19-8-0 |
| సన్న కృష్ణకాటుకలు పాతవి | 25-0-0 |
| ,, (కొత్తవి) | 19-12-0 |
| బియ్యం (166 సౌన్లు బస్తా) | |
| బసంగి | 28.0.0 |
| అక్కుళ్లు (కొత్తవి) | 28-8-0 |
| కృష్ణకాటుకలు (పాతవి) | 33-0-0 |
| ,, (కొత్తవి) | 30-0-0 |
| సన్నకృష్ణకాటుకలు(పాతవి | 39-0-0 |
| కిచిలీ సాంబాలు | 39-8-0 |
| ఉప్పుడు బియ్యం: | |
| బసంగి (సిద్ధంగా యున్నవి) | 28-8-0 |
| ,, (ముక్కపాయ రకం) | 27-0-0 |
| అక్కుళ్ళు (కొత్తవి) | 28-8-0 |
| జొన్నలు (24 కుంచములు) | 24-0-0 |
| నువ్వులు (24 కుంచములు) | 46-0-0, 62-0-0 |
| చోళ్లు | 19-0-0 |
| గంటెలు | 20-0-0 |

ఇతర రాష్ట్రాలకు ఆహారధాన్యాల రవాణా నిషేధించుటవల్ల ప్రయివేటు వ్యాపారం స్తంభించింది. ఇంతకు పూర్వమే మద్రాసు ప్రయివేటు వ్యాపారస్థులతో వ్రాసుకొన్న యొగ్రిమెంటు ప్రకారం వారికి సరఫరా చేయవలసిన సరుకు నాగను సరఫరా లేకపోవుటవల్ల యిచ్చటనే నిల్వయుండిపోయింది. కాబట్టి ఆ సరుకు రవాణాకు అనుమతి యొసంగవలసిందనియు, పరచార్జీ యెంతవిధించినప్పటికి మిల్లు యజమానులు చెల్లించుటకు సిద్ధంగా యున్నట్లు తెలియుచున్నది. ఈ విషయంలో ఆంధ్రప్రభుత్వం వద్దకు రాయబారం వెళ్లుటకు నిశ్చయించినట్లు తెలియుచున్నది. తాడేపల్లిగూడెంలోని అన్ని రైసుమిల్లులు ఉప్పుడుబియ్యం తయారు చేస్తున్నందువల్ల యిచ్చటి మిల్లు యజమానులలో చాలా అసంతృప్తి బయలుదేరింది. స్వేచ్ఛావ్యాపారం చేసుకొనుటకు అనుమతి యొసంగవలసిందని విజ్ఞాపనపత్రాలు ఆంధ్ర ప్రభుత్వానికి, మద్రాసు ప్రభుత్వానికి, కేంద్ర ప్రభుత్వానికి పంపబడెను.

# చిత్తూరు పురపాలక సంఘం

## గవర్నరుకు పౌర స్వాగత మివ్వడానికి నిర్ణయం

చిత్తూరు, డిసెంబరు 27: నిన్న సాయంత్రం 5 ఘంటలకు ఉపాధ్యక్షుడు శ్రీ ఎమ్. లోకనాథ ఆచారిగారి ఆధ్వర్యమున పురపాలకసంఘ సాధారణసభ సమావేశం జరిగింది.

ఫిబ్రవరి నెలలో చిత్తూరు జిల్లా పర్యటనలో గవర్నరు యీ పట్టణమునకు విచ్చేయు సందర్భమున వారికి సన్మానపత్రమును సమర్పించుటకు తీర్మానిస్తూ యిందుకుగాను ఖర్చుల క్రింద 500, రూ. లు. మంజూరు చేశారు.

ఇందు నిమిత్తమే శ్రీ సి. వి. శ్రీనివాసన్, శ్రీ ఎమ్. రాజశేఖరరెడ్డి, జి. సుబ్రహ్మణ్యంశెట్టి జానకిరామన్, శ్రీ జి. కె. స్వామి, విజయ నీహార్ రెడ్డి, శ్రీ సంజీవ నాయుడు గార్లతో ఒక ఉపసంఘం ఏర్పాటు చేశారు.

జనవరి 9 తేదినుంచి 15 వరకు చిత్తూరులో జరగబోవు లలితకళా ప్రదర్శనమునకు 100 రూపాయలు విరాళ మిచ్చుటకు అంగీకరింప బడినది.

# తూర్పుగోదావరిజిల్లా రెవెన్యూ అక్కౌంట్సు ఆఫీసు

కాకినాడ, డిశంబరు 27: ఆంధ్ర విద్యుచ్ఛక్తి శాఖవారు తూర్పుగోదావరిజిల్లా రెవెన్యూ అక్కౌంట్సు ఆఫీసును, ఇక్కడ దేవాలయం వీధిలో యేర్పాటుచేశారు. నిన్నటినుండీ పని ప్రారంభించింది. (స్వ.వి.)

# బొంబై వద్ద రైలు ప్రమాదం

## 35 మందికి స్వల్పగాయాలు

బొంబాయి, డిసెంబరు 29 పూనా నుంచి వస్తున్న 'డెక్కన్ క్వీన్' విక్టోరియా టర్మినస్ దగ్గరవున్న మస్జిద్ బందర్ స్టేషనులో నిలిచివున్న బొంబాయి-గుజరాత్ లోకల్‌తో ఢీకొన్నది. బలమైన గాయాలు యెవ్వరికీ తగలలేదు. 35 మందికి స్వల్ప గాయాలు తగిలాయి. అందరికీ ప్రథమచికిత్స చేశారు. 8 మందిని ఆసుపత్రిలో చేర్చారు.

# ఢిల్లీలోని నేపాల్ రాయబారి మృతి

న్యూఢిల్లీ, డిశంబరు 29: భారతదేశంలో నేపాల్ రాయబారి జనరల్ విజయషంషేర్ జంగ్ బహదూర్ రాణా ఈరోజు పొద్దున ఎలెక్ట్రిక్ షాక్ తగిలి చనిపోయారు.

ఈసంగతి తెలిసిన వెంటనే ప్రధాని నెహ్రూ, రాష్ట్రపతి సైనిక కార్యదర్శి మన విదేశాంగశాఖ కార్యదర్శి ఆర్. కె. నెహ్రూ నేపాల్ రాయబారి కార్యాలయానికి వెళ్లి ఆయన భార్యా బిడ్డలను పరామర్శించారు.

# ప్రకటన

విస్సన్నపేట (కృష్ణా జిల్లా) లో మా ఆంధ్రదినిక, సచిత్రవార, భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు క్రొత్తగా శ్రీ పసుపులేటి శేషకొండలరావుగారిని 20-12-1953 నుండి మా న్యూస్ ఏజంటుగా నియమించడమైనది.

మేనేజరు, ఆంధ్రపత్రిక.

# టెండరు నోటీసు

ఈ క్రింద తెలిపిన పనులకు శ్రీ ఉరవకొండ పంచాయతీ ఎక్సిక్యూటివు ఆఫీసరుగారిచే 11-1-1953 సాయంకాలము 3 గంటలవరకు సీలు వేసిన టెండర్లు తీసికొనబడును. అదే దినము సాయంకాలము 5 గంటలకు టెండర్లు తెరవబడును. మిగతా వివరములు ఆఫీసు పనిచేయు కాలము పగలు 11 గంటల నుండి సాయంకాలము 5 గంటలవరకు పంచాయతీ ఆఫీసునందు తెలిసికొనవచ్చును. డిపాజిట్లు చెల్లించని టెండర్లు విచారించబడవు.

| పని పేరు. | ఎస్టిమేటు మొత్తం. | డిపాజిట్టు. |
|---|---|---|
| 1) బస్సుస్టాండునందు ప్యాసింజరు షెడ్డు కట్టుట. | రూ. 4200/- | రూ. 210/- |
| (2) బస్సుస్టాండునందు బస్సు షెడ్డు కట్టుట. | రూ. 5200/- | రూ. 260/- |



ఉరవకొండ పంచాయతీ ఆఫీసు (అనంతపురంజిల్లా)26-12-1953

యం. వెంకటసుబ్బయ్య, ఎక్సిక్యూటివు ఆఫీసరు



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras.